మొదటి ముద్రణ
1984

ప్రతులు : 1000
వెల : రూ. 7/-



వసంత కుసుమం : 29
భారతీ తీర్థలోకాగమ పుష్పం : 10

Sponsored by :

*Smt. Bollapragada Rajamani Janaki Ram,*
M.A., B.Ed.,
Former Head of the English Department
R. B. V. R. Women's College
Hyderadad.

For Copies :

*Vasantharao Venkatarao*
453-B, M. S. M. Colony
Gnanapuram,
Visakhapatnam - 530 004.

Published by the author
Printed at : Lalita Art Press, Visakhapatnam - 530 001.

మేధావి, విజ్ఞాన ధురీణుడు,
నిరంతర జ్ఞానాసక్తుడు, విద్యార్థుల
ప్రేమాభిమానాలు చూరగొన్న గురూత్తముడు,
సహోపాధ్యాయుల గౌరవాదరాలు పొందిన
మానవ శ్రేష్ఠుడు, సహృదయుడు, సౌమ్యుడు,
ఆంధ్ర విశ్వకళాపరిషత్ భూభౌతిక శాస్త్రాధ్యాపకుడు

డాక్టర్ బొల్లాప్రగడ జానకిరాం
పవిత్ర స్మృతి చిహ్నంగా

అర్ధాంగి

శ్రీమతి రాజామణి జానకిరాం

వెలువరించిన

వి జ్ఞా న వా సం తం

III

## మ న వి

హృదయం యోచనా పూరితమైనప్పుడు ఎట్టి స్పందం కలిగినా దాని ఫలితం గద్యంగానో, గేయంగానో, పద్యంగానో ఇంకే ప్రక్రియగానో రూపొందుతుంది. ఆ రూపం అనుభూతిపొందిన వ్యక్తియొక్క భావసంపదకు, ఆశయాలకు, సంస్కారానికి అనుగుణంగా ఉంటుంది. అత్యద్భుతమైన వైజ్ఞానిక భావాలు తెలుగులో, చాలావరకు, చోటు చేసుకోలేదు. అది తెలుగు సాహిత్యానికి లోపమే. ఆ లోటు తీర్చడానికి చేసిన కృషిలో ఇది అణుమాత్రమే. అయినా, అణువులో బ్రహ్మాండమైన శక్తి నిబిడీకృతమై ఉంది కదా!

ఇంతవరకు గేయాలలో వైజ్ఞానిక విషయాలు వెలువడినట్లు కనిపించదు. తెలుగు సాహిత్యంలో ఇదే మొట్టమొదటి వైజ్ఞానిక గేయ సంకలనం అనడం అతిశయం కాకపోవచ్చు.

వీటిలో కొన్నిటిని ప్రచురించిన పత్రికల సంపాదకులకు కృతజ్ఞతలు, దీనిని "పవిత్ర స్మృతి చిహ్నం"గా ప్రకటించిన చిరంజీవి బొల్లాప్రగడ రాజామణి జానకిరాంకు భగవంతుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదించుగాక!

వసంతరావు వేంకటరావు

# వి ష య సూ చి క

((()))

## 1. జగద్యవనిక

ఢాం ! !
అత్యద్భుత విస్ఫోటం!
ఆద్య ద్రవ్య పరమాణువు
హఠాత్తుగా తునాతునకలయింది!
సృష్టి ప్రారంభ మయింది.
ఆ తునకలు చెదరడం మొదలు పెట్టేయి.
ఒక్కొక్క తునక ఒక్కొక్క గేలక్సీ–
దశ సహస్ర కోటి నక్షత్ర కూటం–
ఒకే యూనిట్‌గా మహాకాశంలో
ప్రయాణిస్తుంది.

ఎటునుండి చూచినా కనిపించే దేమిటి?
చెదిరి పోతూన్న గేలక్సీలు,
బలంగా మనల నేవగించి
పలాయనం చిత్తగిస్తూన్నట్లు,
దూరదూరాలకు పోతూన్నట్లు.
గేలక్సీల పలాయన వేగం
వాటి దూరానికి అనులోమానుపాతం;
దూరం పెరిగే కొద్దీ
పలాయన వేగం పెరుగుతుంది.
ఒకచోదూరముంది; అక్కడ

గేలక్సీ పలాయన వేగం
కాంతి వేగానికి సమానం.
అటు తరవాత?
గేలక్సీలు ఉండవచ్చు,
వాటి కాంతి మాత్రం
మనవైపు సుతరాం రాదు,
మన దృష్టి కవి అగోచరం.
అది ప్రకృతి నిర్ణయం!
ఆ దూరంలో మన చుట్టూ
ఉన్నా దొక జగద్యవనిక,
అభేద్యమైన యవనిక.
ఆ యవనిక లో నున్న దే
మన దృశ్యమాన జగత్తు.
పోనీ, మరొక గేలక్సీకి పోయి చుద్దామంటే
ఆ యవనిక మనతోనే వెంట వచ్చు.
అది మన నడ్డికి కట్టిన గొడుగు.
అందుచేత, యావద్విశ్వరూపం
మన కెన్నడూ కనిపించదు.

## 2. సృష్టి

చెట్టు ముందా? విత్తు ముందా?
చెప్పగలవారెవరు భువిలో?
చెట్టు విత్తులనొకటి ముందుగ
పుట్టియుండుట సహజమే కద!
శక్తియే ముం దుద్భవించెనొ?
ద్రవ్యమే ముందుద్భవించెనొ?
ద్రవ్య శక్తుల నొకటి ముం
దుత్పన్నమై మనుచుండ వలె కద!
శక్తి కణమైనట్టి ఫోటాన్
ముక్తమౌ విద్యు ద్ద్వయమ్ముగ;
ఒక ఎలక్ట్రాన్ ఋణావేశం
ఒకటి పాజిట్రాన్ ధనమ్మట!
మూల కణముల వివిధ రీతుల
మేళనము కూటములు కాగా,
వివిధ ఖారకణమ్ములేర్పడి
వివిధ పరమాణువులు పుట్టెనొ?
అణువులై ద్రవ్యాణువులు జీ
వాణువులుగా పరిణమించెనో?
ద్రవ్యయుత చైతన్యమే మే
ధస్సు కాగా మనిషి పుట్టెనో

## ౨. సృష్టి కీలకాలు

ఆకాశ మహా గహ్వర
మాలోకింపగ నేమగు?
ఒక్క సారి గత కాలం
ముక్కలు ముక్కలుగ కన్పడు?
పొరపొరలుగ చంద్రతలం
పరిశీలించగ నేమగు ?
కోట్ల వత్సరాల చరిత
గూఢముగా గోచరించు.
సృష్టికీలకము లారెం
డిటిలో దాక్కున్నాయట.
ఒక తారక దొకదూరం,
ఒక దూరం ఒక కాలం
ఒకే దూర మందుంటే
ఒకే కాల మందున్నవి,
వాటి కాంతి అన్నియేండ్లు
దాటి వచ్చి భూమి చేర
ఆనాటి స్వరూపంబే
ఈనాడును గోచరించు.
ఈ విధాన గతకాలం
భావిలోని కెగ బ్రాకుచు

మనకు క్షణిక వర్తమాన
మనిపించి అదృశ్య మౌను?
భూతకాల ఖండాలను
జ్యోతులు వెలి బుచ్చు చుండ,
విశ్వచరిత్రాంశంబుల
విజ్ఞానులు వ్రాయుచుంద్రు.
ఉల్లిపాయ పొరలవోలె
ఉన్నదంచు భావించును
చంద్రగోళ మందు పొరలు
కేంద్రాది తలమ్ము వరకు.
పొరపొరలో సక్రమముగ-
పొత్తమందు పుటల వోలె-
గతమును సాంకేతిక ప
ద్ధతిలో దర్శించ వచ్చు
నందురు విజ్ఞాన ఘనులు,
చంద్రఘనత నెరుగువారు.
అరు నూరు కోట్ల యేండ్ల
దీర్ఘచరిత్ర మ్మా శశి
వెలువరింప వచ్చు జ్ఞాన
వీరుల కృషి ఫలితంగా!

## 4. శూ న్య ం

ఆకాశం శక్తియుతం,
ఆకాశం ద్రవ్యయుతం,
ఆకాశం శూన్యమన్న
దే కాలపు భావమ్మది?

తారామయ విశ్వంలో
తావెక్కడ శూన్యానికి ?

ఆకసమున చూడు మసం
ఖ్యాక తారకా నిర్గత
భీకర శక్తి తరంగాల్
మూకుమ్మడి వ్యాపించెను!
ఘనపు మైలులో నున్నది
అనగనగా ఒక్క అణువు,
అణువెకాని శూన్యానికి
కనుగొనగా చెంపపెట్టు!
ద్రవ్యశక్తులకు భేదం
రవ్వంతయు లేదటంచు,
ముకుళిత శక్తియె ద్రవ్యం,
వికసిత ద్రవ్యంబె శక్తి,
అన్యోన్యం రూపాంతర

మొందు చుంట సహజమంచు,
కాకుంటే ఘన తారా
లోకాలే ఉండవంచు,
పరికర నిక్షేపంతో
పరిశీలన, పరిశోధన,
పరిపరి కావించుచున్న,
ఊరుశక్తి సృజించుచున్న,
పరమాణువు నేచుచున్న,
పరమార్థ మెరుంగనున్న,
వర విజ్ఞానులు ఘంటా
పథమున ప్రకటించుచుండ,
ఆకాశం శూన్యమన్న
దేకాలపు భావమ్మది?
ఈ అనంత విశ్వంలో
శూన్యానికి తావెక్కడ?

## ౬. తరంగ సందేశం

శక్తి మహాసాగరంలో మునకలు వేస్తున్నాము.
లక్షలు, కోట్లు, అర్బుదాలుగానున్న
శక్తి తరంగాలతాకిడి భరిస్తున్నాము.
వాటిలో కొన్నివేలు మాత్రమే కంటికి కనిపిస్తాయి,
మరికొన్నివేలు మాత్రమే స్పర్శకు తగులుతాయి.
శక్తితరంగ గ్రహణ సందర్భంలో
శక్తిమంతమై, మహోత్కృష్టమైనది రేడియో!
అగోచర తరంగాలను పట్టుకొంటుంది
గానంగా, ప్రసంగంగా, నాటకంగా
రూపాంతరం పొందించి మనకందిస్తుంది.
అత్యద్భుతమైన గారడీ చేస్తుంది వర్ణపటగ్రాహకం,[1]
తరంగాలను గీతలుగా చారలుగా మార్చి
అడిస్తుంది నాటకం.
ప్రకృతి రహస్యాల నతిచమత్కారంగా వెల్లడిస్తుంది.
వర్ణపట[2]మొక మహాద్భుతమైన లిపి.
శక్తినిచ్చే వాయువు కాంతిగల గీతలు కలిగిస్తే
శక్తిని గ్రహించే వాయువు నల్లగీతలు కలిగిస్తుంది.
దుర్నిరీక్ష్యమైన సూర్యరశ్మి వర్ణపటంలో
నల్లగీతలు కనుగొన్నాడు విజ్ఞాని ఫ్రాన్‌హోఫర్.
మండుతూన్న సూర్యగోళంలోనున్న

1 Spectrogtaph 2 Spectrum

అనేకమూల పదార్థాల ఉనికిని
ఈ నల్లగీతలే వెల్లడించేయి.
ప్రకృతినుండి మరో రహస్యాన్ని డాప్లర్ సంగ్రహించేడు.
ఆత్మభ్రమణంచేసే నక్షత్రంయొక్క
అనువైన అంచునుండి వెలువడే కాంతి
పౌనః పున్యం[3] తక్కువౌతుంది.
ఫలితం?
వర్ణపటంలో గీతలు స్థానభ్రంశం పొందుతాయి,
నీలంవైపో, ఎరుపువైపో జరుగుతాయి.
జరిగి, నక్షత్ర ఆత్మభ్రమణ వేగాన్ని సూచిస్తాయి.
మౌంట్ పలోమార్ రెండువందల అంగుళాల
దూరదర్శినిలో సైతం, ఏ నక్షత్రమూ
బింబంగా కనిపించకపోవడం నిజం.
నక్షత్రబింబమొక వెలుగుచుక్క,
అయినప్పటికీ దాని సహజ ఆత్మభ్రమణముంది.
డాప్లర్ ఫలిత[4] ముంది.
కాగా, గీత చారగా విస్తరిస్తుంది.
ఆచార వెడల్పే నక్షత్రంయొక్క
ఆత్మభ్రమణ వేగాన్ని చాటుతుంది.
కాంతి తరంగాలకంటె పొడవైన తరంగాలను

---

3 Frequencies 4 Doppler Effect

రేడియో దూరదర్శిని పట్టుకొంటుంది.
అది గెలక్సీల - జగద్వీపాల -
పరిమాణాన్ని కొలుస్తుంది
పదివేలకోట్ల నక్షత్రాలు గెలక్సీలో -
మేఘావృతమైన విశ్వధూళిలో -
ఆత్మభ్రమణం చేస్తూ పరిభ్రమిస్తున్నాయి.
విశ్వంలో పదివేలకోట్ల గెలక్సీలున్నాయి.
అనంతం విశ్వం
కాలాకాశా విరతికం[5] విశ్వం.

---

5 Space-time Continum

## 6. ద్రవ్యం – విరుద్ధ ద్రవ్యం

ద్రవ్యం విరుద్ధ ద్రవ్యం
దగ్గరకొస్తే తలపడి,
తక్షణం నాశనమయి
ద్రవ్యమంతా శక్తిగా రూపొందుతుంది.
విరుద్ధ ద్రవ్యమంటే యేమిటి?
విరుద్ధ ప్రోటాన్ చుట్టూ
విరుద్ధ ఎలెక్ట్రాన్ తిరుగుతే
విరుద్ధ హైడ్రోజన్ జనిస్తుంది.
విరుద్ధ మూలకాలు విశ్వంలో ఉండాలి!
విశ్వంతో బాటు
విరుద్ధ విశ్వం కూడా ఉండక తప్పదు.
శక్తి ద్రవ్యంగా రూపాంతరమైనప్పుడు
ముక్తసరిగా ఉత్పన్నమయేవి
ఎలెక్ట్రాన్ పాజిట్రాన్లు జంట.
ఎలెక్ట్రాన్లే కాని పాజిట్రాన్లు
ఎక్కడా మన విశ్వంలో కనిపించవు.
మన ప్రాంతంలో ఎలెక్ట్రాన్లు
సామాన్య ద్రవ్యానికి కారణమైతే
మరో ప్రాంతంలో పాజిట్రాన్లు
విరుద్ధ ద్రవ్యానికి కారణమవుతున్నాయి.

## 7. ఏది నిజం ?

ఈ స్వాస్థ్యం, ఈ నిలకడ
ఈ సుఖానుభూతి నిత్య
మని ఆనందించువారు
ఘనతరమాయా వృతులట!
రకరకాల సూక్ష్మకణాల్
రకరకాల మేళవింప
రకరకాల పదార్థాలు
సుకరంగా సృష్టమయ్యె.
సూక్ష్మ కణాలొక్కొక్కటి
అక్షంపై తిరుగుతునే
అన్యకణం చుట్టు తిరుగు
నన్యోన్య బలాల చిక్కి.
కణముల వ్యూహాలే పర
మాణువులై, అణువులునై
ఘనమును, ద్రవమును, వాయువు
లను ద్రవ్యస్థితులేర్పడె.
ద్రవ్యానికి మూలాధా
రాలైన కణాలు సతము
భ్రమణ పరిభ్రమణములకు
లోనైన ర్తించుచుండు.

సూక్ష్మగ్రాహులు జ్ఞానులు
సూక్ష్మలోక యావత్కణ
నర్తనమేకాని లేరు
నర్తకులని వాకొందురు.
సూక్ష్మలోక మిట్లుండగ
స్థూలలోక మెట్లున్నది?
అసంఖ్యాక తారాసము
దాయమ్మే గేలక్సీ!
అందులోని నక్షత్రా
లన్నీ తమ అక్షంపై
అనుక్షణం తిరుగుచుండు.
అట్టి భ్రమణ ఫలితంగా
అహస్కరునితో భూమియు
ఆకాశపథాల చిమ్మ
చీకటిగల రోదసిలో
గంట కారులక్షల మైె
ళ్ళకొయెకిని పయనించును!
స్థిరమెక్కడ భూమికి? మరి
స్థిరమెక్కడ జీవుల? క
స్థిర జీవనమే నిజమ్ము!

కణలోకంలో భ్రమణం,
అణులోకంలో గమనం,
తారాలోకాలలోన
తరగని భ్రమణం గమనం!
కాని, భ్రమణ గమనమసలు
అనుభూతం కాదు మనకు.
ఇది సత్యం ఇది నిత్యం
ఇది అనుభవ దూరమంచు
సునిశిత పరికరములతో
నొనరించిన ప్రయోగాల
ఫలితాలను విమర్శించి
ప్రకటించిరి విజ్ఞానులు!
అనుభవమే నిజమౌనా?
విజ్ఞానమె నిజమౌనా?

## 8. శబ్దగుణ మాకాశం

ఆదిలో శబ్దమ్ము లేదట,
ఆదిలో కాలమ్ము లేదట,
ఎలెక్ట్రాన్లు ప్రోటానులు
ఏ విధాన పుట్టినవో
ఎరుగుట కే సాక్ష్యమైన
ఇసుమంతయు దొరకదంట.
పుట్టినట్టి ఎలెక్ట్రాన్లు
ప్రోటానుల చుట్టుజేరి
తిరుగజొచ్చె కక్ష్యలలో
రవిచుట్టు గ్రహాలవోలె.
భ్రమణము ప్రారంభమయ్యె.
భ్రమణముతో శబ్దమ్మును
భ్రమణముతో కాలమ్మును
ప్రభవించె నొకేసారి!
శబ్దగుణమ్మాకాశ
మ్మను సత్యము వ్యక్తమయ్యె.
కాలాకాశాల పొత్తు
కాలాకాశా విరతిక space-time-continnum
మై మానవ మేధనెపుడు
మరి మరి సవాల్ చేయు.

## 9. చీకటి *

ఇదియేమి విపరీత
మెట్టి విపరీతమిది?
కోటితారల వెలుగు
కొల్లగొట్టుచు నున్న
ఏటికో నిశ చిమ్మ
చీకటులు వేధించు?
ఒక్కొక్క నక్షత్ర
మొక్కొక్క సూర్యుడై
చిమ్ము శక్తిని ఆక
సమ్మేమి చేసింది?
చీకటికి మితిలేని
ఆకలో కాంతితో
నింపుగా తనపొట్ట
నింపుకొంటున్నాది!
తనకాంతి నపహసిం
చిన కాంతిని వెలార్చ
ఘన తారలను పగల్

---

* "రాత్రి ఆకాశంలో అన్ని నక్షత్రాలు మెరుస్తూన్నా ఎందుకు చీకటిగా ఉంటుంది ?" అని ఆల్బర్ప్ ఆనే విజ్ఞాని ప్రశ్నించేడు. దానినే "ఆల్బర్స్ పేరడాక్స్" అంటారు.

ఖానుడెటు కప్పునో ?
ఒక్కతారక వెల్గు
రిక్కయై వెలుగుటా ?
ముక్కోటి తమసమున
బిక్కుమని మునుగుటా ?
ఇదియేమి విపరీత
మెట్టి విపరీతమిది ?

## 10. తారాదిత్యం

నక్షత్రాల అక్షరాలు చీకట్లో
అక్షయంగా వ్యాపించినా
అజ్ఞాన తిమిరాన్ని బోగొట్టే
సామర్థ్యం వాటికి లేకపోతూంది.
లక్షలాది నక్షత్రాలాకాశంలో
రక్షణలేక సూర్యరశ్మిలో మునిగిపోయి
వ్యక్తిత్వం పూర్తిగా కోల్పోయి, అ
వ్యక్తంగా పగటిపూట అణగి ఉంటాయి.
అతి సామాన్య నక్షత్రం సూర్యుడు,
అతి సులువుగా చీకటినే కాదు
గతిలేని నక్షత్రకాంతినీ మింగేస్తాడు.
సూర్యుని దూరం ఎనిమిది కాంతి నిమిషాలు,
సూర్యుని ప్రక్కనున్న నక్షత్ర దూరం
నాలుగుంపావు కాంతి సంవత్సరాలు !
నిమిషాలెక్కడ ? సంవత్సరాలెక్కడ ?
సాన్నిధ్యంవల్ల గోరంతలు కొండంతలు కావడం !
దూరభారంవల్ల కొండంతలు గోరంతలు కావడం !

## 11. కోపర్నికస్

మానవాహంకార మందాక కనలేని
మహిత సత్యమ్మొకటి ప్రకటించి నాడతడు !
తిరుగుతూందనుకొన్న సూర్యగోళము నాపి
తిరగలేదనుకొన్న భూమిని కదల్చెడు.
ఆకాశ శోధనము నిత్యజీవితమందు
ముఖ్యాంశమైయున్న ప్రాచీన కాలాన
పగలు సూర్యుడు రాత్రి చంద్రనక్షత్రాలు
భువిచుట్టు తిరుగుచుండుట స్పష్టమౌచుండ,
విశ్వకేంద్రము భూమి యనుకొనుట సహజమే !
విశ్వకేంద్రాన సుస్థిరముగానున్నట్టి
భూగోళ మక్షపై వడి భ్రమించినదేని
గూడు వీడిన పక్షి గూడు చేరుట కల్ల !
భూమి సూర్యునిచుట్టు తిరుగుచుండిన దేని
భూమి తుత్తునియలై పోకుండుటే కల్ల !
ధీమంతు లౌ మానవుల కాలవాల మౌ
భూమి జగతికి కేంద్రమవకుండుటే కల్ల !
ఇట్టి భావాధారములపైని టాలమీ
భూ కేంద్ర సిద్ధాంత మెపుడొ ప్రతిపాదించె.
అటు పై శతాబ్దులే గతియించె, గ్రహగతుల
నతినిశితముగ మోటు యంత్రాలతోనైన

ఏళ్ల తరబడి రాత్రులందు పరిశీలించి,
ఎదగుంది, వాస్తవము భూ కేంద్రమే కాదు
సౌర కేంద్రమటంచు సాక్ష్యాలు గమనించి
సరియైన విశ్వచిత్రము సహేతుకముగా
మానవాళి కొసంగె జెట్టి కోపర్నికస్
మాన వాహంకారమునకు ఘాతము కల్గె
అహరహము రవిచుట్టు తిరిగే గ్రహాలలో
గ్రహమొక్కటిగ భూమి తిరుగుతూనే ఉంది.

## 12. ఆజన్మం ఋణపడ్డాం

ఘన విజయం! ఘన విజయం!
ఘన శశాంక తలంపైని
కాలూనిన ఘన విజయం!
తొలి మానవ పాదముద్ర
చెరగకుండ లక్షల వ
త్సరముల పర్యంతం శశి
పై నిల్చే చిహ్నమంట!
చంద్రుడేడ? భూమియేడ?
ఇంద్రజాలమేమో యని
సందేహము కలుగునట్లు
మందస్మిత వదనంతో
"ఈగిల్" ద్వారమ్ము తెరిచి
రాగరహిత సోమగామి
భద్రంగా చంద్ర తలం
పాదాంకిత మొనరించిన
క్షణము భూచరిత్రలో వి
లక్షణమైనట్టి క్షణం.
పునరావృత్తముకాని అ
పూర్వమైన మొదటి క్షణం!
రోదసీ మహాసాగర

ఘోరశక్తి భంగములత
రించుచుండ భూమినావ
రించిన అయనావరణం
బెంత ప్రమాదకరంబో
సుంతైనా ఎరుగముకద!
వాయు రహిత, వారి రహిత
వనజ రహిత, ప్రాణి రహిత
చంద్రునిపై పాదమిడుట
సాహసాతి సాహసమ్ము?
జ్ఞానార్జన చేయుటకై
ప్రాణాలను పణమొడ్డిన,
ఆకాశ విహారులౌచు
ఆ శశాంకు చుంబించిన
ఆంగ్‌స్ట్రామ్, ఆల్డ్రిన్, కాలిన్స్‌కి
కాజన్మం ఋణపడ్డాం!

## 13. చిక్కినావు చందమామ

చిక్కినావు మనుజులచే
చిక్కినావు చందమామ!
నలుగురు మానవులపడే (1970)
పలురకముల పరికరముల
నెలకొల్పిరి మొదటిరెండు
వలసలలో నీ తలమున,
నీ హృదయ రహస్యాలను
నేరుగ భువి కంపుటకై! చిక్కి॥

వాతావరణం లేదని
వాపోయే జాతికాదు,
నీరులేదు బ్రతుకెట్లని
నీరసించు జాతికాదు,
అద్దంలో నీ బింబం
ముద్దుగ కన నక్కఁలే
"దదిగదిగో చిక్క" దంను
ఎదకుందగ అదనులేదు. చిక్కి॥

అమృత భాండముంటే జీ
వామృతముగ మార్చగలం,
పరికరాల నెలకొల్పుచు
పరిశోధన చేయుగలం,

నీ జన్మ రహస్యాలను
నికరంగా చెప్పగలం. చిక్కి॥

అంతే కాదమృతాంశా!
అంతులేని విశ్వంలో
సుంతయు మాకెరుకలేని
పుంతలలో పయనించుచు
దొంతర దొంతరలుగ ఖా
వాంతరమున పెరగగలం ॥ చిక్కి॥

డబ్బు మాటకేమి కాని
అబ్బురమగు జ్ఞానంతో
మబ్బు చీకటుల విచ్చుచు
నిబ్బరముగ సాగగలం. చిక్కి॥

## 14. అనుకొంటే అనుకోనీ !

అక్కజముగ పెరవారికి
చిక్కినయో చందమామః
మానవ పాదాంకితమై
మైలనోకె నీకంటే,
మానవాళి దృష్టియందు
హీనమైతి వీవంటే,
ధీమంతుల వీరుల ను
త్తేజ పరచలేవంటే,
విరహులనిక యేడ్పించే
పీడ వదిలె మాకంటే,
అంటే అనుకోనీ నీ
కంటె సన్నిహితులేరీ?
నీ వెన్నెల చల్లదనం
ఆవంతయు తగ్గలేదు,
నీలికడలి తరగలపై
నీ ప్రాభవ మణగలేదు,
నిన్నుచూచి సాగరుండు
మిన్నంటకె యుండలేదు,
దుర్బల హృదయాలపైన
దొబ్బులాట తగ్గలేదు,

కవిచంద్రుల కవితలపై
భవచ్ఛక్తి మారలేదు,
సృష్టి రహస్యాన్వేషణ
పుష్టిగ కొనసాగుటకై
నీవిచ్చిన శిలలు మా క
నేక గతుల సహకరింప
నీ మూల్యం తగ్గలేదు,
నీవికాస మొరగలేదు.
ఎవరెవరేమన్నా నీ
భవబంధం తప్పదయ్యా!

## 15. చంద్రుడే లేకపోతే !

చంద్రుడే లేకపోతే
సముద్రాలలో ఇంతగా
ఆటుపోటు లుండేవి కావు;
వన మూలికలలో
ఔషధాలుండేవి కావు;
శరత్కాల వెన్నెలలు
కథపై పోయి ప్రతిరాత్రి
అంధకార బంధురమయ్యేది;
విరహార్తితో కుందే
వారికో పెద్దబాధ తప్పేది;
మానవ హృదయాలు
నిష్కళంకంగా ఉండేవి;
సూర్యగ్రహణ భాగమే
శూన్యమయ్యేది,
విజ్ఞాన ప్రగతికి
అవరోధమేర్పడేది;
మన పండుగలు:
సంవత్సరాది పాడ్యమి,
రథయాత్ర విదియ,
అట్ల తదియ, నాగులచవితి,

ఋషిపంచమి, సుబ్బారాయ షష్ఠి,
రథసప్తమి, కృష్ణాష్టమి,
శ్రీరామ నవమి, విజయదశమి,
ముక్కోటి ఏకాదశి,
క్షీరాబ్ధి ద్వాదశి,
శని త్రయోదశి,
నరక చతుర్దశి,
దీపావళి అమావాస్య
గురు పూర్ణిమ:
ఈ పండుగలేమయ్యేవో?
చంద్రుడే లేకపోతే
మానవ జీవితం
మరోవిధంగా ఉండేది,
మరో పథం త్రొక్కేది!

## 16. కాంతి వేగం

అగ్గిపుల్లను పెట్టెకొకసారి రాయగా
భగ్గుమని జన్మించు మంటలో శక్తి కా
వేగమెటు వచ్చెనో? లక్ష ఏనుబదియూరు
వేలమైళ్లొక సెకనులో ఎట్లు పోవునో?
పరమాణు కక్ష్యలో తిరిగే ఎలెక్ట్రాన్లు
పై కక్ష్యనుంచి లోకక్ష్యలకు గెంతగా
శక్త్యంతరము కాంతిగాముక్త మౌనంచు
శాస్త్రజ్ఞులు సహేతుకముగ వివరింతురట.
అది ఎట్టి శక్తి? ఏ రూపాన దాక్కొంది?
అంతవేగము దానికెటు ప్రాప్తమౌతూంది?
కావచ్చు; ముక్తమై అక్షీణ జవముతో
కాలాంతమగుదాక ఎటు ప్రయాణిస్తుంది?
ఈ ప్రశ్నలకు సమాధానమేది? యన్న
"ఏమి" టో చెప్పగల, "మెందు" కన ఏమో?"

## 17. కాలగతి

ఏమిటీ వింత?
ఎల్లా కాలం జారిపోతుంది?
యోచనలతో క్షణాలు స్రవించగా
దీర్ఘ యోచనలకు
దివారాత్రులే గతిస్తాయి.
స్వప్నలోకాల సందర్శనం
సంవత్సరాలనే మింగివేస్తుంది.
అలా అలా యౌవనాన్ని
ఆక్రమించే ముదిమి
అసలు జీవితాన్నే తుడిచివేస్తుంది.
భయానక వృద్ధాప్యంలో
బాగా ముడతలు పడ్డ శరీరంతో
ముదిమి ప్రసాదించే అంధత్వంతో
కాలాన్ని తప్పుకోవాలని ప్రయత్నిస్తే
కలకాలం మిగిలేది ఓటమి!
విరిసినమొగ్గ వికసించి
సువాసనలు వెదజల్లి
వాడి కృశించి నశిస్తుంది.
పిందెగా పుట్టినది
కాయగా పెరిగి

ముదిరి పండయి
చెట్టునుండి రాలుతుంది.
బాల్యాది వార్ధక్యం దాకా
పంచసగా అవస్థలు గడచిపోగా
జీవన యవనిక జారుతుంది.
కాలంతో పందెమొడ్డి
గెలిచే వాడెవ్వడు?
కాలగర్భమందు పడక
నిలిచే వాడెవ్వడు!

## 18. నిరంతర పరివర్తనం

ఏ ఒక్కటీ శాశ్వతంగా నిలిచేదిలేదు!
అన్నీ కాలంతో గమిస్తునే ఉన్నాయి.
సూక్ష్మ కణాలు సంపీడనం చెంది,
చేరి, పెరిగి, రూపంధరించి, గోచరమవుతాయి.
రూపాలను చూచి నామకరణం చేస్తాము
కాని,
విదిత నామరూపాలను పోగొట్టుకొనేవరకు
అవి క్రమక్రమంగా క్షీణిస్తునే ఉంటాయి.
పరమాణువులు వడిగానో మందంగానో కూడి
సూర్యులై, మండలాలై, రూపం ధరిస్తాయి.
ఆ నిరంతర అనివార్యగతిలో
సూర్యులూ మండలాలూ కూడా
మందంగా వెనక్కు జారుకొంటాయి.
ఈ భూమీ, సామ్రాజ్యాలూ,
సముద్రాలూ, విశాల ప్రదేశాలూ,
ఈలోగా
నక్షత్రాలూ, గేలక్సీలూ అన్నీ పోతాయి,
ఆ ఉన్మాద సైకతాలు వాటి స్థానాలను విసర్జిస్తాయి.
మళ్ళీ సముద్రాలు ఆవిర్భవిస్తాయి.
ఏ ఒక్కటీ శాశ్వతంగా నిలిచేది లేదు!

## 19. అంతరిక్ష యుగారంభం

రాక్షస సంవత్సరమున
చైత్రశుద్ధ అష్టమి నా
డంతరిక్ష వైజ్ఞానిక
యుగారంభమయ్యె మనకు!
"ఆర్యభట్టు" ఎకాయెకిని
రోదసిలో సంచరింప
పైకెగసిన శనివారం
మధ్యాహ్నం ఒంటిగంట
మనకో సుముహూర్తమంట!
మనదేశం పెరిగెనంట!
గంటన్నర కొక్కసారి
భూప్రదక్షిణమ్ము చేయు
సేటలైటు సమాచార
సంకేతాల్ పంపుచుండె.
భారతీయ విజ్ఞానం
బహుముఖాల విస్తరింప,
అంతరిక్ష విజ్ఞానం
హస్తగతంబౌచున్నది

## 20. రోహిణి

విజ్ఞానం విరియబారె,
అజ్ఞానం తొలగిస్తూ
విజ్ఞానం సౌఖ్యమిచ్చి
ప్రజ్ఞాపాటవ మిచ్చే
క్షేత్రంగా భావిస్తూ
ఆత్రంగా చూస్తూండగ,
మనదేశం విజ్ఞానులు
మనదేశం సరకులతో
మన శ్రీహరి కోటనుండి
ఘనంగా ప్రయోగించిన
" రోహిణి " — మనసేటలైటు —
రోదసిలో భ్రమిస్తూంది!
అంతరిక్ష విజ్ఞానం
సంతరించుకొన్న మనకు
ఆరోహ్థానమ్మునందు
కూరుచునే భాగ్యమబ్బె!

## 21. వాతావరణ కాలుష్యం

పూత జీవోత్పాదక వినిర్మల విశుద్ధ
వాతావరణ వాయువులు ప్రకృతి దత్తములు.
గుల్మవృక్ష లతాది చైతన్యముదయించె
మత్స్య కూర్మ వరాహ వామనాదులు పుట్టె
వృక్షములు జీవులును సహకారక క్రియల
పెంపొందుచుండె జన్మించినప్పటినుండి.
ఒక్కజాతి కవశ్యమైన వాయువుల నిం
కొక జాతి సమకూర్చి లోటు తీర్చుచునుండ,
అట్టి పారస్పర్యమెన్నో యుగాలుగా
గట్టిగా కొనసాగుచుండె సర్వులు పెరగ.
యంత్ర నిర్మాణ కౌశలముతో విజ్ఞాని
చిత్రాతిచిత్ర పరికరములన్ సృష్టింప.
ప్రాణవాయువు పీల్చి విషవాయువుల విడచు
ప్రాణాంతకంబైన యంత్రాలు కలవందు.
ఒక్కొక్క మోటారుకారొక్క దినములో
నూదివేసెడు ప్రాణవాయువొక మానవుని
కొక్క సంవత్సరంబైన సరిపోవునట!
ఈ లీల ప్రాణవాయువు త్రాగి యంత్రాలు
గాలినెంతో కలుషమొనరించుచున్నవట!

ప్రకృతి నిర్ణయమేమొ? విధివిధాన మదేమొ?
పాతికేండ్ల క్రితమ్ము పరమాణుకేంద్రకాల్
పట్టి భగ్న మొనర్చి బ్రహ్మాండమైనట్టి
పరమాణుగర్భస్థ శక్తి విడిపించేరు.
బలమైన కృతక కేంద్రకములుత్పన్నమై
కాలక్రమాన విస్ఫోటమవుచుండునట
కాలుడైనను వాటినాపజాలడు నిజము.
వాతావరణమొక్క పెద్ద "సింక్" ఏకాని
ఈ తీరున జనించు దుష్టకిరణాల నే
పగిది కడుపున పెట్టుకొని భరించగ నేర్చు?
పగిలి భూతలముపై వెలువరించుటకంటె?
జీవ మా కిరణాల నెటు తట్టుకోగలదు?

## 22. భూమితో చెలగాటమా!

భూగర్భమందు పరమాణు బాంబులు పేల్చి
భూమాత కడుపులో చిచ్చు పెట్టెదవేల?
ఊహకందగరాని ఉత్పాతముల నిట్లు
ఉత్పన్నమొనరింప ఉబలాటపడనేల?
భూకంపమొదవునో? భూస్తరల్ జారునో?
భూసంద్రముల మహా బడబాగ్ని లేచునో?
ఫలితమెరుగని కర్మముల చేయనేలరా?
ఫలవంతమగు భువిని బలిచేయనేలరా?
పొరలు పొరలుగ పేరి తరతరాలుగ పూర్వ
చరితమంతయు భద్రపరిచినది భూదేవి!
ఝంఝానిలమ్మో, స్రవంతీ ప్రవాహమో,
ఝాంకారయుత తీవ్రతర వర్షపాతమో,
భూకంపమొందు తరిపటలమ్ము బద్దలై
పొగలు గ్రక్కుచు వెడలు లావా ప్రవాహమో,
తప్ప భూమినిపట్టి పీడించినది లేదు,
తట్టి భూశక్తులను మేల్కొల్పినది లేదు.
భూమితో చెలగాటమాడుటా! మతితప్పి
స్వామితో పరిహాసమున కుద్యమించుటా!

## ౨౩. వాతావరణ మహోత్పాతం

పరమాణు కేంద్రక గర్భస్థశక్తి నే
పరమపూత దినాన విడిపించిరో కాని
"ఇప్పుడంతా మారిపోయిందిలే, మనిషి
హృదయమందూహించు విశ్వచిత్రము తప్ప!"
అన్నాడు ఐన్‌స్టైన్ మహాజ్ఞాని సుజ్ఞాని
అత్యంత హృదయభారమ్ముతో, ఆర్తితో.
అందాక వాతావరణమెప్డు చక్రీయ
మైన ప్రక్రియలనే జరిపించుచుండేది.
నాటినుంచి వినూత్నశక్తి విక్షేపించు
కోట్లుకోట్లుగ కృతక పరమాణు కేంద్రికా
లుత్పన్నమై, భూమినావరించి, నిరంత
రోద్వేగమున పగిలి శక్తి ప్రసరింపగా
గతితప్పె వాతావరణ స్వాస్థ్య సర్వమ్ము,
మతితప్పె ధీశక్తిగల మనుజ సంఘమ్ము.
కృతకమైనట్టి ఈ రేడియో ధార్మికత
సతము వికిరణశక్తి విడిపించువంటచే
గాలి పొరలో అనుత్క్రమణీయ చర్యలే
కలిగి దానిని మహా సంక్షోభమొనరింప
చక్రీయమైన ప్రక్రియలేదా? భూమిలో
సక్రమమ్మగు సహజ పరిణామ మదియేదా?

## 24. నిలకడ మనకేదీ?

కుర్చీలో కూర్చున్నా,
మంచంపై పడుకొన్నా,
కదలకుండ ఉన్నామని
మది తలచుట పెద్ద కల్ల!
కదలలేదు మనం నిజం,
కదులుతూంది భూగోళం
కలకాలం మన వాసం.
క్షణమైనా ఆగకుండ
తన అక్షంపైన భూమి
తనలో తను తిరుగుతూంది,
తిరుగుతునే ఏటికొక్క
పరి సూర్యుని చుట్టుతూంది.
పద్దెనిమిది మైళ్ళుపోవు
పరుగుసుమీ సెకనులోన
ఏపుగ గంటకు అరవై
ఏడువేల మైళ్ళగునట!
గంట గంటకిన్ని మైళ్ళు
మింటినిబడి పోవుచుండి
నిలకడగా ఉంటిమనుట
నిజమౌనా? కల్ల గాక!

## 25. చిత్ర జగతి

విరుద్ధాల పొత్తులతో
విలసిల్లే చిత్ర జగతి!
ఒక్క అయస్కాంతముగాని
ముక్క ముక్కలుగ చేస్తే,
ప్రతి ముక్క అయస్కాంత
మౌతుందని చూడవచ్చు.
ఉత్తర దక్షిణ ధ్రువముల
పొత్తు అయస్కాంత మగును.
జంట ధ్రువాలే కానీ
ఒంటరిగా ఒక్క ధ్రువం
బింత వరకు కనపడ లే
దెంత ప్రయత్నం చేసిన.
ఎలెక్ట్రాన్ ప్రోటానులు
కలబడితే న్యూట్రానగు;
ఒక్క దాని చుట్టొక్కటి
చక్రాకృతి తిరుగునపుడు
పరమాణువులే జనించి
పలురకాల వస్తువులౌ.
విరుద్ధాల పొత్తులతో
విలసిల్లే చిత్ర జగతి!

## 26. కాలం దాచిన శక్తి

భూమి పుట్టినపిదప ఎంతకాలమువరకు
పొగలు గ్రమ్మెడు మంటలెగజిమ్ముచుండెనో?
ఎన్ని వందల కోట్ల ఏండ్లుగడచిన పిదప
సన్న సన్నగ వాయువులు ద్రవాలయ్యెనో?
ద్రవము ఘనమైనపుడు భూపటల మేర్పడగ
ద్రవ జలమ్ములపుట్టి పెరుగుచుండిన జీవ
పసుకూల సముదాయాస నేలపై కెగబ్రాకె.
భూతలము సంకీర్ణ కాంతార సంయుతము
భూమిపై నందాక పుట్టలేదె జీవి!
సంకీర్ణ వృక్షతతి పుష్కలముగా పెరిగి
జడివానలకు చిక్కి చివికి జీర్ణించి, వి
చ్ఛిన్నమై మట్టిలో పడిపోయి, పటలమ్ము
చించుకొని లోజొచ్చి, లోపీడనోష్ణముల
అత్యంత రూపాంతరంబొంది జన్మించె
నేలబొగ్గుగ, ముతక నూనెలుగ, వజ్రముగ.
కోట్ల సంవత్సరాల్ ప్రకృతి సాధించినది
కొన్ని వందల యేండ్లలో మనిషి పెకలించి
పొదుపు చూపే లేక తగలెట్టుచున్నాడు.
ముందట్టి నిధులెట్లు సృష్టించనున్నాడో?
పాడిమిమ్ము యంత్రాలు ఏ-వె మనున్నాడో?

## 27. జడిమ

ద్రవ్యమునకీ జడిమయేమిటి?
ద్రవ్యమే చైతన్యయుతమై
ప్రాణిగా రూపొందినంతనె
పాంచభౌతికమౌ శరీరము
స్వయం చోదకశక్తితో, ధీ
బలముతో, సృజనాత్మకంబగు
భావములతో, దీక్షతో, ని
స్స్వార్థముగ వర్తించుటేమిటి?

* * *

కదలకే నిలకడగనున్నది
కదలకుండుట; గమిస్తుంటే
ఆగకుండా ఒకే వేగము
తో గమించుట సూటి పథమున,
జడపదార్థపు లక్షణములని
జడిమ గతి నిర్వచించిరి.

## ౨౮. వర్తమాన భవిష్యత్తులు

అంతరిక్ష యాత్రారంభంతో
అంతరంగ సంక్షోభం పుట్టెను;
వేలమైళ్ళ జవ మాకాశంలో
వేలయోచనలు హృదంతరంలో.
మానవాభ్యుదయ పథకాలెందుకు
గ్రహాన్వేషణా పథకం ముఖ్యం!
శుక్రతలంపై పేరాషూట్లో
సక్రమంబుగా మనిషిజారితే
అప్పడమట్లు జారిపోవునో?
చప్పున గుప్పున మండిపోవునో?
శోధించుటకై అంతరిక్ష పరి
శోధన నౌకల లాంచిచేతురట!
హేలీ కామెట్ పెద్ద తోకతో
నాలుగేండ్లలో రానున్నాదని,
దాని బుర్రలో, దాని తోకలో
దాగొన్న పదార్థాల నెరుగుటకు
లక్షలరూకల యంత్రసంచయం
లక్షణంబుగా ప్రయోగింతురట!

* * *

తోకచుక్కలు గ్రహాలెట్లున్న మనకేమి?
వేడిలోకాలలో జీవముంటేనేమి?

సామాన్యునికి కూడు గుడ్డ వసతులు కూర్చ
సరసమైన ప్రభుత్వ మత్యవసరము కదా!
కోట్లు ముప్పైయారు, కోట్లు నలబైయైదు,
కోట్లు ఏబైనాల్గు, కోట్లు అరవైమూడు,
సంక్షేమ కార్యక్రమాలకవుతున్నదని
సంభ్రమాశ్చర్యాల మునిపోవునటుచేయు

ప్రసారముల విని, ప్రచారముల గని
ప్రజాహృదయ మెటు క్షోభిస్తూందో,
రోజురోజుకూ పెరిగే ధరలకు
రోజుకొనే జనులెట్లున్నారో?
తింటున్నారో? పస్తున్నారో?
తెలుసుకొనే! ఘనులున్నారయ్యా?
మంత్రివర్యులా? ఎమ్మెల్యేలా?
యంత్రాంగ ప్రభుత్వాధికారులా?
అభయహస్తమే ఉభయతారక
మ్మను భావంతో సత్యమరయకే
ప్రజాస్వామ్యమని ప్రజలనెత్తిపై
పడవేసే భస్మాసురహస్తం,
తుట్టతుదకు కబళించిన వైనం
గుట్టుగ మదిలో తలచండయ్యా!!

* * *

"దేశమంటె మట్టికాదోయ్
దేశమంటే మనుజులోయ్" యను
దేశికోత్తము దివ్యగానం
దేవలోకం చేరపోయెను!
మర్త్యలోకము నందపస్వర
మై తనంతట మూగపోయెను.

సర్వజీవులను నాశంచేసే
సంగ్రామంబే పొంచియున్నదట!
మారణాయుధం న్యూట్రాన్ బాంబుగ
మారణహోమం చేయనున్నదట;
బాంబుప్రేలితే జనులందరు తమ
ప్రాణాలను పోగొట్టుకొందురట,

ఆశ్చర్యం:

మేడలు మిద్దెలు, రమ్యహర్మ్యములు,
మిన్నంటు పరిశ్రమల వాటికలు,
రైలుమార్గములు, ఆనకట్టలును,
రహదారుల సంధించు వారధులు,
యథాతథంగా చెక్కుచెదరకే
ఆహ్వానించును శత్రుసేనలను.
వచ్చినవారిని తొలగించుటతో

వచ్చిన శత్రువు లాక్రమింతురట.
అగ్రరాజ్యముల సేనానాయకు
లంతరంగ స్వప్నములిట్లున్నవి!
మట్టికాదా దేశమంటే
మట్టికోసమె కదా యుద్ధం !!

## 29. మారణ యంత్రాలు

అరవై వత్సర చక్రంలో నొక
ఆకు ఒరుగు, వేరొక్కటి నిలుచును,
ఏది ఒరిగినా ఏది నిలిచినా
లేదీ మానవజాతికి సౌఖ్యం.
విజ్ఞానాభ్యుదయంతో మానవు
డజ్ఞాతక్షేత్రాల గమించుచు
పరికల్పించిన బహుధా సంకుల
పరికరములు సుఖశాంతులీయకే
హృదిలో సుడిగుండాల్ కలిగించుచు,
హృదయమార్దవం నాశనమొనర్చుచు,
మది మాత్సర్యాల్ ప్రేరేపించుచు,
మధురాశయముల కలుషమొనర్చుచు,
మానవత్వమును మంటబెట్టుచు, ఆ
మానుష రాక్షస క్రోధానలమును
సంఘంపై ప్రసరింపచేయగా
సంఘాభ్యున్నతి సాధ్యంబౌనే?

మనిషితోడనే పుట్టినయుద్ధం
మానవాళినే కబళించాలని
మారణాస్త్ర నిర్మాణకౌశలం
మానవజాతికి సంతరించెనో?

హింసాత్మకమౌ అణుశక్తులతో
ధ్వంసమొనర్చు నవీనపద్ధతులు,
దేశదేశముల మొత్తంగానే
నాశంచేసే శక్తిమంతములు.
సూర్యరశ్మిలో ప్రమాదకరముగ
చురికే శక్తిని శోషణచేస్తు,
పుట్టినదాదిగ వాతావరణపు
పొరలు జీవులను రక్షిస్తూంటే,
పొరలకు చిల్లులు పెట్టి రశ్మితో
పరిమార్చే నవ విధానమొక్కటి;
సేటలైటు కంట్రోలు చేయగల
మేటి న్యూక్లియర్ వార్ హెడ్ లోపల
దాని టెలివిషన్ స్క్రీన్‌లో కన్పడు
దేశభాగముల మ్యాప్‌తో పోల్చుచు
టార్గెట్‌పైనే పేలునట్లుగా
ట్రిగర్ చేయగలవరికర మొక్కటి;
సేటలైట్ల ఉద్గారపువేడిని
సేకరించి, గుర్తించి, శరమ్ముటు
వెంబడించుచటే సూటిగ డీకొని
పిప్పిచేయగల సాధనమొక్కటి;

## 30. సముచిత సాంకేతిక శాస్త్రం

విజ్ఞాన సూత్రాలాధారంగా
వికసిస్తుంది సాంకేతిక శాస్త్రం.
ప్రతిదేశానికీ సహజమైన వనరులున్నాయి,
ప్రత్యేకమైన అవసరాలున్నాయి, సంస్కృతి ఉంది.
ఏదేశానికనువైన సాంకేతిక శాస్త్రం
ఆదేశానికవసరం, అత్యంతావశ్యకం;
దానిని గుర్తించి పెంపొందించడం
మనీషాపరులైన విజ్ఞానుల కర్తవ్యం.
పురోగామి దేశాల సాంకేతిక శాస్త్రం
పూర్తిగా గుడ్డిగా బడుగుదేశాలు
అనుగమించడం శ్రేయస్కరం కాదు,
అనుసరణ దేశాభ్యుదయకరం కాదు.
గ్రామాలమయం భారతదేశం,
గ్రామాలు కర్షకుల కాలవాలం.
వారికి ఏడాదీ పని పూర్తిగా ఉండదు,
పనిలేని సమయంలో వృత్తివిద్యలు ఫలింపచేసే
ప్రణాళికలు తక్షణం అనుసరణీయం.
మన దేశానికి కావలసింది భారీపరిశ్రమలే కాదు.
ఎనభై శాతానికి పనికల్పించి తిండిపెట్టే వృత్తులు.
బ్రతుకుభారం తగ్గించి సుఖం కూర్చే

బహువిధ వృత్తుల పెంపుదల.
బహుళోత్పత్తి కాదు కావలసింది
బహుజనంచేసే ఉత్పత్తి,
చేతులు చేతులు కలిసి సృష్టించే
చిత్రమయిన వివిధ వస్తుజాలం.
ఒక యంత్రం నూరుమంది పనిచేస్తుంది,
ఆ యంత్రం నూర్గురి కూడు పడగొడుతుంది.
ఆకలితో అలమటించే పొట్టలు
ఆక్రోశిస్తున్న మన దేశంలో
వాటితో పోటీపడే యంత్రాల
పోషణం పెంచడం ధర్మంకాదు.
సజీవయంత్రం మనిషి, ఆ
సజీవ యంత్రాన్ని పోషించి పెంచే
సాంకేతిక శాస్త్రాభివృద్ధికి
సమర్థులైన విజ్ఞానులు పూనుకోవాలి.

## 31. విద్యార్థీ !

విద్యార్థీ! విద్యార్థీ!
విద్యాభ్యాసం చేయుగ
ఉద్యోగార్హత పొందగ
సద్యః ఫలమొందు విశ్వ
విద్యాలయ మందు చేరి
విద్యార్జన చేయుచున్న
హృదయము వికసించుటెట్లు?
పదముల జ్ఞాన పథంబున
ముదమారగ మించుటెట్లు?
మదితో మరి మేధ కూడ
పదము సాచి పెరుగుటెట్లు?

చేయలేవు జ్ఞానార్జన
జీవిత వలయాలచిక్కి
సుడులందు భ్రమించు చుండ,
ఘడియలు చేజారుచుండ,
నిస్సహాయ మను పాములు
బుస్సున బుస కొట్టుచుండ
అధికారపు జ్వాలలలో
అహం కాలి మండు చుండ!

కాని, విషాదావృతమగు
నీసై రాశ్యానికేమి
కారణమ్ము కలదో యని
కలయజూడ గోచరించె:
మున్నెన్నడు కనని వినని
ఎన్నెన్నో పైశాచిక
శక్తులు నిన్నావహించి,
రక్తముడుకునట్లు కలచి,
కర్తవ్యం మరుగుపరచి
యుక్తాయుక్తముల చెరచి,
శాంతి దాంతి సౌఖ్యమ్ముల
సొంతంగా త్రుంచిపైచి,
విద్వేషం రెచ్చగొట్టి
హృద్వేగం హెచ్చింపగ
నీకెక్కడ కలదు వేళ
ఆకళించుకొన జ్ఞానం?
నీ కెక్కడ కలదు మనసు
లోకజ్ఞానాన్ని పొంద?

నిజమే, నిజమే: మరి నీ
ఋజు మార్గం తప్పినపుడు

జ్ఞానం చేజార్చుచు వి
జ్ఞానం చేకూర్చ నపుడు
పౌరునిగా కర్తవ్యపు
తీరు తెన్ను తెలియ నపుడు,
రాజ్యాంగం నడిపించే
భాగ్యం నీ కబ్బినపుడు,
దేశనాయకత్వం నీ
దేహంపై పడినప్పుడు,
బాధ్యతాయుతమ్ముగా ని
భాయించుట సాధ్యమగునె?
అంతర్జాతీయంగా
నుంతైనను నిలువగలద

కడచిన కాలంరాడను
గడ్డు నిజము తెలియు వోయి,
విద్యార్థిగ జ్ఞానార్జన
విధిగా నొనరింపవోయి!
"భవిష్యత్తు మాది కదా!
భావి పురోగమనానికి
మార్గం కంటకయుతమై,
దుర్గమమై, దుస్తరమై

దుస్సహమై వేధింపగ,
నిస్సహాయముగ చూస్తూ
నిర్వేదించుట తగునా?
మార్గం సుగమం చేసే
మార్గాన్వేషణ తప్పా ?"

"తప్పుకాదుకాని, యథా
ర్థస్థితి గమనించలేక,
కర్తవ్యా కర్తవ్యాల్
గుర్తించే దృష్టి లేక,
నీ స్వధర్మ నిర్వహణకు
నిరతం కష్టించలేక,
జ్ఞానార్జన జన్మహక్కు
గా ననయు మెరుంగ లేక
ఎవరెవరో ఎందులకో
ఏదేదో చెప్తుంటే
ఆవేశానల కీలల
కప్పగించి నీ హృదయం,
వారి భావ సారాంశం
స్పష్టంగా తెలియలేక,
పిల్లి కోతి కథలో నొక

పిల్లి వోలె నీ చేతులు
కాల్చుచుండ "త్యాగ" మంచు
కై పెక్కుచు గంతులేసి
నృత్యం చేయుట తగునా?
సత్యమేల చూడవయా?

తొలి పాతిక వత్సరాల
కలకలలో జ్ఞానాబ్ధిని
ఆ పోశన మొనరించుచు
అగస్త్యుడవు కావలదా
కరుణారస హృదయాంతర
గాంభీర్యములందు మునిగి
భవ్య కావ్యముల సృజించు
వాల్మీకివి కావలదా?
ఆశయాల పదిలముగా
అంతరంగమందు దాచి,
ఆశయ సిద్ధికి సర్వ
త్యాగానికి సిద్ధపడిన
గాంధిజీవి కావలదా

కావాలని కావాలని
కాలాంతర మందు నోట

నెత్తి మొత్తుకొన్నను పై
కెత్తువారు కనిపించరు!
దుయ్య బట్టువారె కాని
"అయ్యో" అను వారుండరు;
తొలి పాతిక వత్సరాల
కలలు కరిగి మాయమౌను,
అంధకార బంధురమై
ఆశాహతమైన జీవ
మత్యంత విషాదానికి
అంతిమ మార్గమ్ము చూపు.
చదివి సేవ చేసెదవా?
చదువక పాడయ్యెదవా?

## 32. మనిషి పశువై పోవునేమో ?

ప్రగతిమార్గం తప్పినది ఈ
ప్రపంచంబిక మనుట కష్టము!
ప్రగతి పేరున వికృతియే విక
టాట్టహాసం చేయుచున్నది.
మారణాస్త్రా లనేకముగా
మురుగుచున్నవి దేశములలో,
మానవత్వం మరుగుపడి ఏ
మారుమూలనో మూల్గుచున్నది.
హింస దౌర్జన్యాలనే పో
షించుచున్నవి ప్రభుతలెల్లెడ,
పాలకులు పాలితుల చంపుచు
పణంబిచ్చుట పాడియైనది.
జీవ పరిణామము హఠాత్తుగ
తోవ తప్పెనొ? మనుజుల చిక్కులు.
మానవాతీతుండు కాగల
మనిషి పశువై పోవునేమో!

## 23. ఎందుకీ కీచులాట ?

ఏమతమైతేనేమి చెప్పవోయ్,
ఏకులమైతేనేమి చెప్పవోయ్,
మతములు కులములు మనిషిచేసెనోయ్.
మత సంఘర్షణ, కుల సంఘర్షణ
మతి మంతులకేనాడు తెలియదోయ్,
ఏమతమైనా, ఏకులమైనా,
మానవజాతి సమస్తంబొకటే
మానవ ధర్మం జగమందొకటే;
తాను సుఖించుచు పరుల సుఖానికి
తానొకమార్గం చూపవలెనయా!
రూపు రేఖలో, వేషభాషలో,
చూపట్టినపై విధ్యం యావత్
శివం శవంగా మారినంతనే
శిథిలంబై ఏకత్వమొందదా?
మతమేదైనా కులమేదైనా
మృతదేహాలకు గమ్యంబొకటే;
పంచభూత సమ్మేళన ఫలితం
పంచభూత విశ్లేషం పొందుట!
నిత్య సత్యమిది
నిరసించకయే
సమతా భూముల
సాగుచేయవోయ్!

## 34. ప్రకృతి హృదయం

ఏ మొగ్గ విచ్చునో?
ఏ పిందె కాయునో?
ఏ కాయ పండునో!
ఏ పండు రాలునో?
చెట్లను పరీక్షించి
చెప్పగలవారెవరు?
ప్రకృతి హృదయమ్మెరుగు
పరమ పురుషులు దక్క!
ఏ చేను పండునో?
ఏ పంట నిలుచునో?
ఏ భాగమందుండి
గాదెలో చేరునో?
చేలను పరీక్షించి
చెప్పగలవారెవరు
ప్రకృతి హృదయమ్మెరుగు
పరమపురుషులు దక్క!
పరమాణు వేది ఏ
సమయాన పేలునో?
పరమాణు గర్భమెటు
విచ్ఛిత్తి నొందునో?

పరమాణువుల పరీ
క్షించి చెప్పేదెవరు?
ప్రకృతి హృదయమ్మెరుగు
పరమపురుషులు దక్క!
తారాసమూహాల
సృష్టి స్థితిలయాలు,
తార నవతారగా
రూపొందు ప్రక్రియలు,
తారల పరీక్షించి
చెప్పగలవారెవరు?
ప్రకృతి హృదయమ్మెరుగు
పరమపురుషులు దక్క!

## ౬౮. నిండు కుండ

అనుకొన్న పని పూర్తి
యైనప్పు డిచ్ఛయే
బలమైన దను భావ
మలరగా హృది పొంగు.
అనుకొన్న పని పూర్తి
కానప్పు డిచ్ఛయె
కొరగాని దనిపించు
కొరతచే హృది క్రుంగు,
పొంగు క్రుంగులులేని
పూర్ణ హృదయమ్ముతో
నిండు కుండగ ఎప్పు
డుండువా డే ఘనుడు!

## 36. విధిచక్రికిస్తే !

ఆత్మార్పణ మొనర్ప
అహమడ్డు తగులు,
అహము జీర్ణించునప్పు
డాత్మ కింపొదవు!
విశ్వాసమొకవంక
వృద్ధియౌచుండ,
సంశయాలోక పంక
సంక్షోభపెట్టు!
మనసు నిలకడయైన
దనుకొన్న యపుడు,
చెదరి దౌష్ట్యముపై పు
శీఘ్రముగ పారు!
మనసు కేంద్రీకరణ
మొనరించునపుడు,
భావాలు విక్షిప్త
మై వేగరించు!
మనసు నరికట్టు సా
ధనమేదో తెలియ
దిన దినమ్మభ్యాస
మొనరింపలేరు.

శాంతి నాశించి వి
శ్రాంతి కోరంగ,
భ్రమలు వ్యాపించి వి
భ్రాంతి కలిగించు!
పూజకై కూర్చున్న
పుణ్య సమయాన,
భోగలాలసత సం
పూర్ణముగ పట్టు!
మంచి చేదామంచు
ముందడుగు వేయ
నెంచినప్పుడు పాద
మించుకయు పోదు!
చెడుజోలికే వెళ్ల
కూడదనుకొన్న
వడివడిగ అటువైపె
పడిచచ్చు మనసు!
అలవుగా మంచి చె
డ్డల కెపుడు జరుగు
పోరాటమున మంచి
పొందుఃనపజయము!

## 37. మనః పతనం

మంచి చేయును మంచి,
చెడ్డ చేయును చెడ్డ,
మంచి చెడ్డలమధ్య
మనసూగుచుండెపుడు,
మనసు సరియైనదే
తనమంచి కోరునదె
తన సౌఖ్యమాశించి
పనిచేయు కడగునదె,
ప్రకృతి నియమా లెరిగి
ప్రజ్ఞతో చరియింప
ప్రబలయత్నము చేయు
ప్రకృతికలదే; కాని
కనుకప్పి, చెవిమూసి,
కటిక చీకటిలోకి
మెడపట్టి గెంటుచుం
డెడు శక్తులకు చిక్కి
తన పటిమ విస్మరిం
చిన మనసుగతి తప్పి
చెడుమార్గమున
చెడు దుర్గతిని పొందు!

## ౩౮. ఆనందం

మనిషి పెరగాలన్న
మనసునొక కంట
కని పెట్టి యుండ గల
పనులు చేయాలి.
పరుగెత్తు మనసెపుడు
పాదరస మట్లు,
పరుగు నరికట్టు ని
బ్బరము పెరగాలి
నిశ్చింతగా బ్రతుక
నేర్చుకొన్న పుడు
నీమూర్తి హృదయాన
నిలుపుకో గలను.
హృదయాన నీమూర్తి
వదిలముగ నుండ
ముదముతో నీసేవ
మది చేయగలను.
సేవలో లగ్న మై
స్థిరపడును మనస్సు.

## 39. నేను.

పుట్టకే గిట్టుటయు సాధ్యమె?
గిట్టకే పుట్టుటయు సాధ్యమ?
పుట్టుటయు గిట్టుటయు జీవుని
పట్టి వదలని పరంపరలట!
"నేను" నేనను అహంకారమె
కాని నిజముగ "ఎవరునే" నని
మాన సాంతర మందు సంశో
ధన మొనర్చిన ఏమి తెలుసు?
"నా మనోజ్ఞ శరీర" మందురు,
"నా మహోజ్జ్వలమేధ" యిందురు,
"నా వినిర్మల హృదయ" మందురు
"నా విశిష్టప్రజ్ఞ" యుందురు.
కా వివేవియు "నేను" ; కావున
"చావుచా" వని భయం దేనికి?
అంత మందివి మిగిలి పోగా
హంసవలె "నే" నెగిరి పోవును

## 40. శ్రుతులు.

అ పౌరుషేయములు వేదము
లంటే పరిహాసమేల?
శ్రుతులంటే స్మృతులంటే
మతి తప్పిన హాస్యమేల?
మానవాళి చెవిసోకని
ధ్వను లాకసమున లేవా?
రేడియో ఖగోళ శాస్త్ర
రీతులు పరి కింతువేని,
ఝుంఝూ వాతం పోలిక
ఝుం ఝుమ్మని వెతలి వచ్చు
తీవ్ర శక్తి భంగాల్ గు
ర్తింప కలిగి యుందువేని,
జను లెప్పుడు వినజాలని
ధ్వనులే లేవని జాలవు!
ఆ ధ్వనులను గుర్తించిన
మేధావులు వివరింపగ
శ్రుతులయ్యెను, రాను రాను
స్మృతులయ్యె, వివాద మేల?

## 41. శక్తి—అశక్తి

ఎటుచూచిన ఎటుచూచిన
ఎటుచూచిన శక్తి శక్తి!
వెలుగు శక్తి, వేడి శక్తి
వివిధ భంగములుగ చెలగు
విద్యు దయస్కాంత శక్తి!
చలనం, భ్రమణం, శబ్దం
జలగమనం శక్తియుతం.
శక్తి నేర్చె రేడియో ప్ర
శస్త గానముగ వెలార్చు.
శక్తి సంగ్రహించి జలము
జలధరములగ సంచరించి
సస్యోత్పత్తికి వలసిన
జలముల వర్షము గా నిడు.
నీటి పారు దలలో గల
మేటి శక్తి విద్యుత్తుగ
కోటి రూపములను జీవ
కోటికి సంతోష మొసగు.
శక్తి సాగరమున మునిగి
శక్తి తాడనముల కొదిగి
శక్తి నేరుగా గ్రహించు

శక్తి లేని జడుడు మనిషి!
భుక్తి కొరకు పాటు పడుచు
ముక్తికై తపించు చుండు.
మనో ద్వారములను తెరచి
జ్ఞానరాశి నాకళించు,
మనో నేత్రములను తెరచి
జ్ఞాన భాస్కరుని చూడుము.
భౌతిక మత్యంత మహా
బాధాకర మనుట నిజము,
హాయి గూర్చు మానవాళి
కాత్మ తత్త్వ మనుట నిజము!

## 42. శక్తి–ద్రవ్యాలు

శక్తి ద్రవ్యాల మయం విశ్వం,
శక్తి ద్రవ్యాల నిత్యత్వం సత్యం!
శక్తి ద్రవ్యంగా రూపొందినా,
శక్తిగా ద్రవ్యమే రూపొందినా
విశ్వంలో శక్తి ద్రవ్యాల మొత్తం
నిత్యమన్నది పరమ సత్యం!
మండు తూన్న నక్షత్ర ద్రవ్యం
మెండుగా శక్తిగా రూపొందుతే
అతి శీతల రోదసిలో
శక్తి ద్రవ్యంగా రూపొందు తుంది.
ఈ అన్యోన్య పరివర్తనానికి
ఈ వేషాల మార్పుకూ
అనంత కాలాకాశమే
అను కూలమైన నాట్యరంగం!
ఈ అనంత వైవిధ్యానికీ,
ఈ అపార చైతన్యానికీ,
మానవ హృదయ వికాసానికీ,
మానవ మనః కాలుష్యానికీ,
జీవ కారుణ్యానికి
జిహ్వా చాపల్యానికీ,
ప్రేమానురాగ భక్తులకూ,
కామక్రోధ లోభాలకూ,
కారణం, శక్తి ద్రవ్యాల
కాలాకాశంలో ఖేలనం!

## 43. జడం-జీవనం

జడం జీవం
ఏమిటి భేదం?
జడం జడత్వ కారణంగా
స్తబ్ధమై ఉంటే,
జీవం చైతన్య కారణంగా
మిల మిల లాడుతుంది.
కర్మకు ప్రతికర్మ
అదే క్షణంలో ఉత్పన్నమైనా
జడంలో ప్రతికర్మ
వెంటనే కనిపించగా,
జీవంలో ప్రతికర్మ
వెంటనే కనిపించక పోవచ్చు;
కర్మకు సమానంగా ఉండక పోవచ్చు;
అయే ఆలస్యం చైతన్య
పటిమ మీద ఆధార పడుతుంది.
జడం పంచభూతాలకు లోబడి
సహజక్లైబ్యం పొందితే,
జీవం పంచ భూతాల నెదిరించి
శతధా వృద్ధి పొందుతుంది.
జడం ప్రకృతి సూత్రా ధీనమై ఉంటే,
జీవం ప్రకృతి సూత్రాల నధిగమించ గల

జడం—జీవనం

జపం పెంపొందించు కొంటుంది.
జడం బాహ్య బలాలకు లోబడి ఉంటే
జీవం బాహ్య బలాల నెదుర్కొంటుంది.
జడం వానకు తడిసి, చివికి
ఎండకెండి పగులుతే,
జీవం ఎండవానలకు అతీతమై ఉంటుంది.

* * *

జడంలో జడత్వం చీల్చుకొని
చైతన్యం ప్రవేశించి వ్యాపిస్తే
జడమే జీవమవుతుంది.
జీవంలోని చైతన్యం
పలాయనం చిత్తగిస్తే
జీవమే జడమవుతుంది.

## 44. పరిణామం

పరిణామం సార్వత్రికం కాదు.
పరిణామం అన్నిటికీ లేదు.
అణువులు, పరమాణువులు
పరమాణు కణాలు,
ఫోటాన్లు, న్యూట్రినోలు
బహుశా విశ్వం పుట్టినప్పటి నుండి
స్వధర్మాలను కాపాడుకొంటూనే ఉన్నాయి.
వస్తువులు–నిర్జీవాలైనా, సజీవాలైనా–
పరిణామానికి విధిగా లోనవుతాయి.

* * *

కొండలు బండలై
కుండపోత వర్షాలకు,
కొరడు వారించే చలికి,
మండుటెండలకు,
ప్రచండ వాతాహతికి,
పగిలి పగిలి భగ్నమై,
వాలుకా కణాలై
పరచిన ఇసుక పర్రిలవుతాయి.
భూకంప స్ఫోటాలకు
భూమ పర్వతా లుద్భవిస్తాయి.
కాలానికి దాసోహ

మ్మంటుంది జీవం.
కాల చక్రం భ్రమిస్తూంటే
పుట్టు చావుల వలయాన్ని
తట్టుకో లేక జీవనం భ్రమిస్తుంది.

*　　*　　*

ఎంత వరకు?
నిస్సంగత్వంతో,
నిర్మల హృదయంతో,
కర్మఫల త్యాగంతో,
జన్మ రాహిత్యం
పొందే వరకు!

## 45. విరుద్ధాల పొత్తు

నరహంతకు లెంత మంది
నరులందు వసించు వారొ?
మంచి భావములను నరికి
మంట పెట్టు చుండు వారొ?
దౌష్టమ్మును వదలి పెట్టు
దామంటే మన సొప్పదు,
సన్మార్గం బవలంబి
ద్దామన్నా మనసొప్పదు.
మంచి చేయమను నెవ్వరు?
మంచిని వారించు నెవరు?
ఆశయ కారకు లెవ్వరు?
ఆంక్షలు పెట్టెదెవ్వరు?
ఈ చిలిక హృదయంలో
ఏ తీరున పొదుకొనెనొ?
ఈ విరుద్ధ భావాలకు
ఎటు పొందిక కల్గెనో?
మంచి చెడ్డలొకే చోట
ఏగతి మనుచుండునో?

* * *

ఉత్తర దక్షిణ ధ్రువములు
ఒకే అయస్కాంతమందు

## విరుద్ధాల-పొత్తు

పొత్తుతో వసించి అయ
స్కాంతత్వము చూపవా?
ఎలెక్ట్రాన్లు ప్రొటానులు
పరమాణువునందు చేరి
బలవత్తరమైన వ్యూహ
ములు అన్ని వసింపవా?



## 46. అథకేన ప్రయుక్తోయం....?

"అథకేన ప్రయుక్తోయం
పాపంచరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ
బలాదివ నియోజితః ?"

* * *

అస్తమానం అనేకంగా
ఆకసంలో ఆడు చుంటాయ్
వివిధ భావశిలీముఖమ్ములు
వివిధ శక్తులతో జవంతో !
రేడియో అలలెన్ని ఉన్నా
రేడియో కాజేయు కొన్నిటి,
భావ బాణాలెన్ని ఉన్నా
జీవుడొక కొన్నిటిని లాగును.
తెలిసి చేసిన కార్యమైతే
తెలివిగా లాక్కొనే వాడే,
ట్యూనుచేసే గుబ్బపై కం
ట్రోలు లేదని తెలియదకటా !
విషమ భావ శిలీముఖమ్ములు
వీలుగా హృదయాన జొరబడి
విషమ చర్యలుచేయ మనుజుని
విధిగ ప్రేరేపించుచున్నవి.
కాని,

## అథకేన ప్రయుక్తోయం....?

రాగ భోగములను వీడి
యోగ మార్గగామి యగుచు
యోగసిద్ధులను పొందు వి
రాగి మనోనిగ్రహమున
భావబాణముల నెరింగి
కావలసినవే గ్రహింప
ట్యూను చేయు గుబ్బను కం
ట్రోలు చేయ సాధ్యమగును.
కాబట్టి
"అథభావ ప్రయుక్తోయం
పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి కౌంతేయ
బలాదివ నియోజితః।

## 47. బాహ్యాంతర దూరాలు

భూవాసులింతవర కధిగమించగలేని
భూ గురుత్వాకర్షణ మ్మధిగ మించేవు !
భూమి పుట్టిన దాది తొలిసారిగా చంద్ర
భూమిపై కాలూని తిరిగి వచ్చేసేవు.
జీవానుకూల వాతావరణ యుతమై, వి
శేష వేగముతో గమించు రాకెట్లతో
శూన్యరోదసిలోని కారుచీకట్లలో
చొరవగా విహరించి, ఆకాశమున తేలి,
లక్షలాదిగ మైళ్ళు హేలతో పయనించి,
కక్ష్యలో భువిచుట్టు శశిచుట్టు భ్రమియించి,
దూరాల నవలీల చేరుకో గల మహా
ధీరోత్తముడవంచు కీర్తినార్జించేవు.
కాని,
మనిషిలో చీలికల దూరమేర్పడు చుండె,
మనిషి మనిషికి మధ్య దూరమేర్పడు చుండె,
దూరమూరక పెరిగి దూరాతి దూరమై
చేరుకోలేని దుస్థితిని కల్పించగా
ఎడమొగము పెడమొగము క్రూర హింసలు పెరగ
వడివడిగ విడిపోవుచున్నారు జనులెల్ల.
ఈ దూరమధిగమించెడు తీరు నేర్చుకొని
ఆనందమొనగూర్చవలదోయి మానవా !

## 48. క్షణం

ఒకే క్షణాన్ని రెండుసార్లు అనుభవించలేము.
ఒకే పూర్వ నిర్ణీత శ్రుతితో
రంగంలో ప్రవేశించి, ఘర్షణ
రహితంగా క్షణం జారుకొంటుంది.
ఒకే క్షణం జీవితంలో
ఒకేసారి వస్తుంది,
రావడమే తడవు పోతుంది.

* * *

సినిమా రీలులో చిత్రం వంటిది క్షణం.
ఏ చిత్రానికి కాచట్రంలో కదలికలేదు.
అది స్థిరంగా ప్రింట్ అయిపోయింది.

కాని, రీలు నొకవడితో త్రిప్పినప్పుడు
ప్రతి బొమ్మలో చలనం ఆవిర్భవించి
ప్రకృతి దృశ్యమే ప్రత్యక్ష మవుతుంది.

* * *

నిరంతరం అవిచ్ఛిన్నంగా
గమిస్తూన్న క్షణ పరంపరలో
క్షణాన్ని పట్టి సుఖించడం నేర్చుకొంటే
దైన్యానికీ, నైరాశ్యానికీ,
అసంతృప్తికీ తావేలేదు!

## 49. దారి చూపేదెవరు ?

విద్యుదయస్కాంత తరంగాల సముద్రం
మధ్యనివసిస్తున్నాం మనం.
తరంగాలేకాదు కణాలు కూడా జీవ
తాడన క్రియలో నిమగ్నమైయున్నాయి !
విజ్ఞానం గుర్తించలేని భావతరంగాలు సైతం
అజ్ఞాతంగా అదే పనిచేస్తున్నాయి.

* * *

మనిషిని పశుత్వంపైపు
మరలించే స్థితిగతులేమిటి ?
హింసాత్మక ప్రవృత్తిని
ప్రేరేపించే కార్యాలేమిటి ?
శాంతి తృప్తులతో జీవించనీయక
క్రౌర్యావేశాలకు తరిమే కారణాలేమిటి ?

* * *

విజ్ఞానం గుర్తించలేని శక్తులకు లోబడి
అజ్ఞానాంధకారంలో బడి
వ్యామోహ తరంగాలలో మున్కలువేసే
సామాన్యునికి దారి చూపేదెవరు ?

## 50. భావ శలాకలు

మంచి చెడ్డలు నే నెరుంగుదు,
మంచిచేయుట కుద్యమింతును,
ఇంతలో ఎవరో హఠాత్తుగ
పంతమునఁ నన్నడ్డినట్లగు;
మంచి యోచన మాయమవగా
కుంటుపడి హృదయమ్ము క్రుంగును.
ఇది నిరంతర మయే ఘర్షణ,
తుది కనంబడ దెంతవేచిన.
చెడును పూర్తిగ తుడిచివేసే
వడి విధానం తెలియదేలా ?

× × ×

ఎంత చెప్పిన మనసు లొంగదు,
నుంతయును తన పథము మార్చదు.
కర్మకున్నది సమాన ప్రతి
కర్మ మన్నను కలతచెందదు;
చెడుకు చెడుగే కలుగుతున్నను
చెవిని పెట్టదు విశ్వసూత్రము.

× × ×

ఈ ప్రవర్తన కసలు కారణ
మెరిగినను లాభించకున్నది.
మన మెరుంగని శక్తి రూప
మ్మునని భావాల్ బాణములవలె
సంచరించు సతము జీవుల
సహనశక్తిని సవాల్ చేయునొ ?

## 51. హృదయాకాశం

అకాశం లో సుకరంగా సంచరించి
బాహ్యాకాశం జయించేవు.
హృదయాకాశంలో ఎందుకైనా
ఎప్పుడైనా పర్యటించేవా?

× × ×

బాహ్యాకాశంలో
విద్యుదయస్కాంత తరంగాలు,
ప్రమాదకర వికిరణాలు,
కిరణాలు, కణాలు,
విద్యుదావేశాలు,
అయస్కాంత బలరేఖలు,
వికృత అయాన్ మండలాలు,
విశాలమైన వాన్ అలన్ మేఖలాలు,
వ్యాపించగా సంచారం
ప్రమాదభరితమైనా
ఫలవంతంగా పర్యటించే
పథకం కనుక్కొన్నావు.

× × ×

హృదయాకాశంలో
చైతన్య స్ఫులింగాలు,
సుఖ దుఃఖ స్పందాలు,
స్వార్థ పరార్థ ప్రకంపనాలు,
కరుణ కాఠిన్య తన్యతలు,

## హృదయాకాశం

రాగద్వేష పీడనాలు,
ప్రేమ వైషమ్య తరంగాలు
భక్తి దౌష్ట్య వికిరణాలు,
వ్యాపించగా,
దుష్కరమైన సంసారం
అత్యంత సుకరంచేసుకోనే
మార్గాన్వేషణకు పూనుకొన్నావా?
మన స్సంయమనం నేర్చుకొన్నావా?

## 52. అవసర ద్వంద్వాలు

ద్రవ్య ప్రపంచంలో
ద్రవ్యస్థైర్యానికి కారణం
విరుద్ధ కణాల, బలాల
విశిష్టాకర్షణ మాత్రమే!
ఎలక్ట్రాన్ ప్రోటాన్ల ఆకర్షణ
ఎన్నో మూలకాల జన్మ హేతువు,
అయస్కాంత విరుద్ధ ధ్రువాల ఆకర్షణ
అయస్కాంతం మనుగడకే కారణం.
విరుద్ధాల జంటలు, ద్వంద్వాలు
విశ్వస్థితికే అవసరాలు.

* * *

జీవ ప్రపంచంలో:
జీవాభ్యుదయంలో
విరుద్ధాల జంటలు
విశిష్ట పాత్ర వహిస్తాయి.
శీతోష్ణాలు, సుఖ దుఃఖాలు,
కలిమి లేములు, మంచిచెడ్డలు;
ఇవన్నీ విరుద్ధాలజంటలు.
ఒకటి లేకపోతే రెండోది లేదు,
కాని, జీవనప్రగతికివి అత్యవసరాలు!

## ౬౩. నాగరికతా? తృప్తజీవనమా?

మానవుడెంత దౌర్భాగ్యుడు!
అసంఖ్యాక తరంగదైర్ఘ్య సమన్విత
విద్యుదయస్కాంత తరంగాలలో
మునిగి తేలుతూ
వాటిఉనికినే గుర్తించలేని
ఇంద్రియాల కధిపతి!
గామాకిరణాలుకాని, X -కిరణాలుకాని,
అతినీలలోహిత తరంగాలు కాని,
పరారుణ తరంగాలుకానీ,
రేడియోతరంగాలుకానీ,
కంటికికనిపించవు!
చెవికి వినిపించవు!
ఆ కిరణ తరంగ ప్రపంచమంతా
మానవునికేవిధంగాను అనుభూతం కాదు.
వాటినిగుర్తించేప్రయత్నాలు
బహు విధ యంత్రనిర్మాణానికి దారితీసేయి,
సాంకేతిక విజ్ఞానం ప్రబలింది.

* * *

సాంకేతికజ్ఞాన విప్లవంబేమయ్యె!
ఆకాశంమంటెడు ధరలనే సృష్టించె.

## నాగరికతా? తృప్తజీవనమా?

మనిషి చేసిన పనులు మరలచే చేయింప
యంత్రాల వలన విశ్రాంతి కల్గునటంచు,
అలసట లేకుండ హాయిగా జీవించు
భాగ్యమబ్బునటంచు, బహుళార్థసాధక
కృషి చేయగలరంచు, కృప చూడగలరంచు,
యంత్రనిర్మాణ సన్నద్ధుడయ్యెను మనిషి.
యంత్రశాలలు పెరిగి, యంత్రాలు దినమెల్ల
పనిచేయవలసె వచ్చెను, వాటి నడుపుటకు
మనిషి కావలసి వచ్చెను; పోయె విశ్రాంతి.
యంత్రాల రోదలోన అంతరంగ గళమ్ము
వినిపించనట్టి దుర్గతికి పాలైనాము.

* * *

బాహ్యశక్తుల శోధించు పరికరముల
తెలివిగా కట్టిపెట్టి, లోదృష్టి పెంచి,
హృదయగుహలోని దైనమో పదిలపరచి
నేర్పుతో దానిపనిచేయనేర్పెదేని
కలుగు సంతృప్తి, శాంతి సౌఖ్యములు వరలు,
మానసిక శక్తులుత్పన్నమౌను, దివ్య
కరుణ భాసించు, తోడిసోదరులమీద

నాగరికతా? తృప్తజీవనమా

ప్రేమజనియించు, సాంఘిక విధులు తెలియు,
ఆత్మసంస్కారమలవడు; ఆత్మశక్తి
భౌతికానికి జతచేసి ప్రగతి మార్గ
మందు పయనించ గలవు మున్ముందు నీవు!



## 54. చావంటే భయ మెందుకు?

చావంటే భయ మెందుకు?
చావంటే రూపు మార్పు!
పుట్టి పెరిగి పారిపారి
ముదిమికి భయ మొందినట్టి
ముసలి యేరు వాపోయెను:
" నా బ్రతుకిక ముగియువచ్చె,
నా అంతం సమీపించె,
కొండలలో చరియలలో
దుందుడు కుగ గెంతినట్టి
మైళ్ళు మైళ్ళు పారినట్టి
మైమరచిన జీవితమ్ము
మరణ ముఖం బౌ చున్నది,"
ఏరు కార్చుచుండిన క
న్నీరు సాగరమున జొచ్చె,
నిలకడ లేనట్టి యేటు
నిరతము ప్రవహించు చుండ.
మునిగినప్పుడున్న నీరు
మునిగి లేవ కదిలి పోవు;
స తము ప్రవ హించు యేరు
శాశ్వత మను నమ్మికతో

పుట్టి పారునదికి పేరు
పెట్టి పిలుచు కొను చుందుము!

× × ×

నరుల జీవ శరీరాలు
నది వంటి వె చూడ చూడ,
అవిచ్ఛిన్న పరివర్తన
మసలు వాటి సహజధర్మ,
మొక క్షణమున నున్నట్లు మ
రొక్క క్షణము నందుండవు,
అయినా శాశ్వత మనుకొని
ఆదరించి పేరిస్తాం.

× × ×

నది సముద్ర మందు కలిసె,
నది జీవిత మంతరించె,
నీరు నీటిలో కలియగ
పేరొక్కటి మాసి పోయె,
ఏటి నీటి చుక్కలలో
ఎట్టి మార్పు కలగ దాయె.
వ్యష్టిగా భ్రమించిన నది
వ్యక్తిత్వం రుపు మాసె.

సాగరమే నదిమూలం
సాగరాన్ని నది చేరెను.
నది సాగర మున కలియగ
నది పేరొక్కటి పోయెను.

*　　*　　*

శత సహస్ర కరుడు దయా
సాగ రుండు సాగర జల
ముద్ధరింప రూపుమారి
లాఘవమై మేఘాలై
రయమున ద్రవమౌచు మరల
వర్షంగా అవతరించి
నదిరూపం దాల్చి మైళ్ళ
చెదరక ప్రవహించి తుదకు
మూలమైన సాగర క
ల్లోల ములం జేరి పోవు

×　　×　　×

జగమంతా వ్యాపించిన
చైతన్యంలోని అంశ
మొకటి రూపుదాల్చి పంచ
భూతమ్ముల కలయికతో

వృక్షముగనొ, పక్షిగనో
మృగముగనో, మనుజుడుగానొ;
బ్రతికి నంత కాలమేదొ
కర్తవ్యం నెరవేర్చును.
కాలాంతర మందు తనువు
చాలించగ పంచభూత
ములు తమ తమ నెలవులు చే
రగ చైతన్యాంశం తన
మూలమందు కలిసి పోవు.

× × ×

చావంటే భయ మెందుకు,
చావంటే రూపుమార్పు!

## 55. విశ్వ వాస్తవి కత

వివిధ దృష్టుల నుండి
విశ్వ వాస్తవి కతను
విజ్ఞాని వేదాంతి
విశదీకరిస్తారు.
పాంచ భౌతిక మౌ ప్ర
పంచ మంతయు తీవ్ర
పరిశోధనలు చేసి
పలికించు విజ్ఞాని;
అతి గుహ్య గంభీర
మంతః ప్రపంచ మం
దాత్మశక్తి పరీక్ష
యందుండు వేదాంతి.
ద్రవ్య శక్తుల సకల
ధర్మాలు తెలుసుకొని
వాస్తవిక విశ్వ రూ
పము చూడ వచ్చు నని,
యంత్రాలు నిర్మించి,
యంత్రాలలో శక్తి
మంతమౌ కణముల
సంఘాతములు జరిపి,

అతి పెద్ద సంఖ్యలో
నుత్పన్నమౌచు, త
క్షణ మదృశ్యం బయే
కణజాలముల చూచి;
ద్రవ్యముగ శక్తియే
తన రూపమును మార్చి
కణ రూపమును దాల్చి,
క్షణములో శక్తిగా
పరివర్తనం బౌట
ప్రత్యక్షముగ చూచి,
శక్తిసాగర మహో
త్తుంగ భంగంబులే
ద్రవ్యాకృతి ధరించు,
ద్రవ్యమూలము శక్తి,
నర్తించు శక్తియే
కర్తగా ద్యోతించు,
నాట్యమాడు కణాల
నాట్య నిత్యత్వమే
వాస్తవ యదార్థమని
ప్రవచించు విజ్ఞాని.

తనువు మిథ్యగ నెంచి
మనసును నిరోధించి
యోగ మార్గములో ప్ర
యోగములు చేయగా,
అణిమాది సిద్ధులు
హ స్తగతం బౌట
దివ్యాను భూతిలో
తేలియాడుచు సదా
నందవార్థి మునింగి,
స్పంద రహితమ్ముగా
నిశ్చలావస్థ లో
నిర్ని ద్రముగ పొందు
అనుభూతి వల్లనే
అర్థ మగు విశ్వ స
త్యంబనును వేదాంతి.
అనుభూతి లేని వి
జ్ఞాని వర్ణన మొకటి:
అనుభూతి పొందు వే
దాంతి వర్ణన మొకటి:

## ౭౮. శివతాండవం

పరమాణువులు సూక్ష్మ
కణముల వ్యూహాలు,
పరమాణు కేంద్రకం
బందున్న ఉపకణాల్
క్షణ క్షణమ్మును రూపు
మార్చుకొను చుంట చే
కణ సఖ్య రెండు వం
దల దాక పెరిగె నట!
మూడే కణాలు పర
మాణు వందున్న వని,
మూల కణాలుగా
మొదట భావించేరు.
శక్తిమంతము లైన
యంత్రాలు నిర్మించి,
యుక్తమౌ కణముల
కధిక శక్తి నొసంగి,
వాటితో " టార్గెట్ " ను
" బొంబార్డు " చేయుగా,
నీటుగా సరికొత్త
కణములే కనిపించె.

ఈ చిత్ర బహుచిత్ర
ములచేత విజ్ఞాను
లాకృష్టులై, నూత్న
భావములు పెంపొంద,
ఈ నాటి విజ్ఞాన
మేమి చెబుతున్నాది?

* * *

సూక్ష్మ కణ లోకమొక
నాట్య శాలంటూంది,
సూక్ష్మ కణముల రూపు
మారుతూం దంటూంది.
ఒక్క కణముగ వచ్చి
వేరొక్క కణముగా
చక్కగా తన రూపు
మార్చగల దంటూంది.
రెండు కణముల తోడ
ప్రారంభమై మరో
రెండు కణములు పుట్టి
నాల్గుగా వర్తించు.
మన మిచ్చు శక్తియే

కణముగా రూపొంది

క్షణ కాల మొక నూత్న
కణముగా భాసించి
క్షణములో తన రూపు
పలకపై ముద్రించి,
శక్తి రూపము దాల్చి
కణ మదృశ్యం బౌను!
అతి శక్తియుక్త కణ
లోక మం దనిశమ్ము
మతి చెదర కన్పట్టు
నాట్య విన్యాసాలు.
నర్తకులు నర్తించి
నాట్య సుధలో చేర,
కర్తలెవరో చెప్ప
లేని స్థితి కలుగు.
నర్తనమ్మే కాని
నర్తకులు లేరన్న
దత్యుక్తి కా, దది
కణ లోక సత్యమ్ము.

* * *

విశ్వమే అద్భుతం
చైన నర్తన శాల,
విశ్వేశుడే ప్రథమ
నర్తకుండను భార
తీయ భావము సత్య
మని ప్రయోగాలతో
తృప్తిగా విజ్ఞాని
ప్రవచించు చున్నాడు!

## 57. కార్యాలొకటైనా కారణాలు వేరు

కార్యాలొకటే, కారణాలు మాత్రం వేరు.
జడప్రపంచంలో,
శాశ్వత అయస్కాంత ముంది
దాని నావరించి అయస్కాంత క్షేత్రముంది.
అ యస్కాంతక్షేత్ర తీవ్రత
అయస్కాంతం తయారైనప్పుడే నిర్ణయ మయింది.
తగిన జాగ్రత్తలు వహిస్తే క్షేత్ర
తీవ్రత తగ్గకుండా కాపాడు కోవచ్చు.
అయస్కాంతం జేబులో వేసుకొంటే
అయస్కాంత క్షేత్రం కూడా
జేబులోనే ఉంటుంది,

* * *

లోహపు తీగె చుట్టలోంచి
విద్యుత్తు ప్రవహింపచేస్తే
దానిచుట్టూ అయస్కాంత క్షేత్ర
మా విర్భ విస్తుంది—
విద్యుత్తు ఉన్నంత వరకే దాని ఉనికి,
అది విద్యుదయస్కాంతక్షేత్రం.
అయస్కాంత క్షేత్ర ధర్మాలూ, ఈ
విద్యుదయస్కాంత క్షేత్ర ధర్మాలూ ఒక్కటే,

రవంతైనా వ్యత్యాసంలేదు.
అవి సర్వ సమానం.
కాని
విద్యుదయస్కాంత క్షేత్ర తీవ్రతను
యథేచ్ఛగా పెంపొందించ గలం;
విద్యుత్ ప్రవాహం సత్వం ఎక్కువ చేసో,
తీగె చుట్టల సంఖ్య ఎక్కువ చేసో,
అయస్కాంత క్షేత్ర తీవ్రత పెంచవచ్చు.
రెండూ అయస్కాంత క్షేత్రాలే;
ఒకదానికి కారణం శాశ్వత అయస్కాంతం,
రెండో దానికి కారణం
తీగె చుట్టలలోని విద్యుత్తు,
మొదటిది పరిమితం,
రెండోది అపరిమితం!

* * *

మానవ ప్రపంచంలో:
మానసిక శక్తివల్ల హిప్నటిజం, మెస్మరిజం
వంటివి కొన్ని సాధించవచ్చు,
వాటి వల్ల జనాన్ని ఆశ్చర్య
చకితుల చేయవచ్చు.

యోగాభ్యాసం వల్ల ఆత్మశక్తి పెంపొందించుకొని
అణిమాద్యష్ట సిద్ధులు—అణిమ, మహిమ,
గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం
ఈశిత్వ వశిత్వములు—సంపాదించ వచ్చు.
అవి అతీంద్రియ శక్తులకు మూలం.
అట్టి అతీంద్రియ శక్తుల వల్ల కూడా
జనాన్ని ఆకర్షించ వచ్చు.
జనానికి రెండూ ఒకే విధంగా కనిపిస్తాయి.
అంత మాత్రాన మానసిక శక్తి
ఆత్మ శక్తిని సవాల్ చేసి
సాధించే దేమీలేదు.
శాశ్వత అయస్కాంతం విద్యుదయస్కాంతాన్ని
సవాల్ చేస్తే ఓడిపోయేది
శాశ్వత అయస్కాంతమే!

* * *

కార్యాలొకటైనా కారణాలు వేరు
అనే నిజం తెలుసుకో కుండా
కార్యాన్ని బట్టి కారణాన్ని
ఊహించడంలో పొరపాటు జరిగితే,
మనసులో గందరగోళం చెలరేగి

అనవసరమైన సవాళ్ళకు దారి తీస్తుంది,
"రేషనలిజం" అంటూ "ఇరేషనలిజం"
వైపు పరుగెత్తి అలజడి కలిగిస్తుంది.
కార్యాలొక్కటే అయినా కారణాలు వేరు
అనే సత్యం గ్రహించిన విజ్ఞులకు
సవాళ్ళతో సంబంధంలేదు.



ప్రతి విషయంబున "శాకర్మం" బని
ప్రలాపించుటే తప్పండీ,

## ౯౮. బింబం-ప్రతి బింబం

బింబం లేక పోయినా,
దర్పణమో, పరావర్తక తలమో,
కటకమో లేక పోయినా,
ప్రతి బింబం లేదు.
బింబ ప్రతి బింబలక్షణాలు
ఎప్పుడూ సర్వ సమానాలు కావు.
సమతల, పుటాకార, కుంభాకార,
పర వలయిక దర్పణాలూ,
పరా వర్తక తలాలూ, కటకాలూ,
రకరకాల వెన్నెన్నో ఉన్నాయి.
ప్రతిబింబ లక్షణాలను నిర్ణయించేవి
దర్పణ స్వభావం, దర్పణ దూరం.
ఒకే దర్పణంలో ప్రతిబింబం
వాస్తవం కావచ్చు, మిధ్య కావచ్చు.
కొన్ని దర్పణా లెప్పుడూ
మిథ్యా ప్రతి బింబాలనే ఏర్పరుస్తాయి.
బింబ లక్షణాలన్నీ ప్రతి బింబంలో
లేక పోవడమే కాక,
లేనివి ఆపాదితం కావచ్చు,
కుడి ఎడమలు మాత్రమే

కొన్నిటిలో తారు మారు కాగా,
కొన్నిటిలో ప్రతి బింబాలు దీర్ఘమై,
కొన్నిటిలో హ్రస్వం కావచ్చు,
బింబంలో లేని వక్రతా, వర్ణమూ,
ప్రతి బింబంలో ప్రత్యక్షం కావచ్చు.
ఎంత పరిమళ రోజా పుష్ప ప్రతిబింబమైనా
పరిమళాన్ని ప్రతి ఫలించ లేదు కదా?
ఎంత దక్షత గల కటక మైనా
వ్యక్తి పూసుకొన్న సెంటును
ఫోటోలో గుబాళించ లేదు కదా,
అవి దర్పణ కటకాల
పరిమిత తత్వం మాత్రమే!

* * *

మిథ్యా వాస్తవాల మధ్య
దీర్ఘ హ్రస్వాల మధ్య,
ఋజు వక్రతల మధ్య
దర్పణ లక్షణాలను బట్టి
ప్రతిబింబాలు ఊగులాడుతాయి.
పరావర్తన నియమాలూ
వక్రీభవన నియమాలూ

క్షుణ్ణంగా తెలిసినవారు
ప్రతిబింబ లక్షణాల రహస్యం
గ్రహించి, మోసపోక,
ఆ అభిలక్షణాలనే బింబానికి
ఆరోపించక, బింబస్థితిని
యథార్థంగా నిర్ణయిస్తారు.

× × ×

భగవంతుడు బింబమైతే
ప్రకృతి దర్పణంలో ప్రతిఫలించే,
ప్రకృతి కటకంలో వక్రీభవించే,
ప్రతిబింబం జీవుడు.
చంచల ప్రకృతి బహువిధ
దర్పణాలుగా, పరావర్తకాలుగా
కటకాలుగా ప్రవర్తించి ఏర్పరిచే
ప్రతిబింబాలలో
బింబ నిజలక్షణాలను అన్వేషించే
ఆత్మ, ప్రకృతి నియమాలను క్షుణ్ణంగా
అర్థం చేసుకోకలిగితే,
ప్రతిబింబ లక్షణాలకు మోసపోక
తన నిజస్వరూపాన్ని దర్శించగలదు

ప్రకృతి దర్పణాన్ని
తొలిగించ కలిగిన నాడు,
ప్రతిబింబం బింబంలో లీనమై,
బింబ ప్రతిబింబాల
లక్షణాలేకమవుతాయి!
అందుకే, వ్యాస భగవత్పాదులన్నారు:
" శ్లోకార్ధేన ప్రవక్ష్యామి
యదుక్తం గ్రంధకోటి భిః।
బ్రహ్మసత్యం జగన్మిధ్యా
జీవో బ్రహ్మైవ నాపరః॥ "

